జానపదసంఘముం గూడి: దానినుండి
త్రాణ మగు నన్ను గూడ, మృగంబు జంప,

ఒంటిగా నేను బాధలో నున్నయపుడు
భీకరారణ్య గర్తాన, నాకు మృగము
ఓమహాప్రభూ, చేసినయుపకృతి మది
మెలగ నేగతి వధియింపగలను దీని ?

ఆవల శక్రుడు పురోహితుని శరీరమునుండి వెలువడి నిజరూపము ధరించి ఆకసమున నిలిచి రాజగుణములను ప్రకటించుచు ౨ గాథలు పలికెను ;

వర్ధిల్లు మోమిత్రపాలకా, చిరము
ధారుణి నేలుము ధర్మవిధాన
పరిచర్య బొందుచు తరుణులచేత
స్వర్గాన వాసవుసరణి సుఖించు!

అక్రోధనుండ వై , అనవరతంబు
శాంతచిత్తంబుతో సకలాతిథులకు
భిక్షుకజనులకు బెట్టుచు నీవు,
ఉచితభోగంబుల నొందుచు, నింద
పొందక స్వర్గంబు నొందుము రాజ!

ఇట్లు పలికి దేవరాజ శక్రుడు "మహారాజా, నిన్ను పట్టుటకై వచ్చినాను, కాని నీవు పట్టుపడలేదు. అప్రమత్తుడవై యుండుము" అని యుపదేశ మిచ్చి నిజనివాసమునకు జనెను.

శాస్త ఇట్లు ధర్మోపదేశము చేసి "భిక్షువులారా, సారిపుత్తు డిప్పుడే కాదు, పూర్వజన్మమున కూడ సంక్షిప్తోపదేశమున విస్తృతార్థమును గ్రహించినవాడు" అని జాతకమును సరిపోల్చెను.

ఆ కాలమున రాజు ఆనందుడు; శరభమృగము నేనే,

o

చతుర్థ సంపుటి